# శిఖరం




టి. శ్రీరంగస్వామి

# శిఖరం

టి. శ్రీరంగస్వామి




సాహితీ మిత్రులు
మచిలీపట్టణము

# SHIKHARAM

( Freeverse Poetry )

By

T. SRIRANGASWAMY



Price: Rs. 3.

Publication No. 4.

Published by
Sahithi Mitrulu
Machilipatnam.

Printed at
Ushodaya Printers,
Machilipatnam.

# శిఖర దర్శనం

కవిత్వం సంగీతంలా ఆపాత మధురమైన కళకాదు, వినగానే తలూపటానికి. ఆలోచనామృతం. తనకు కలిగిన అనుభూతి విశేషాన్ని గాని, ఆలోచనా విశేషాన్ని గాని కవి మాటల్లోకి దింపి చదువరికి అందించ టానికి ఎంత ప్రయత్నం చేస్తాడో, ఎంత తపన పడతాడో అంత ప్రయత్నం, అంత ప్రయాస ఆ మాటలద్వారా, ఆ అనుభూతిని, ఆ ఆలోచనను అందుకోటానికి చదువరి కూడా చేయాలి. ఏ ప్రయత్నం లేకుండా అది అర్థమవ్వటం అంటే దాన్ని కవిత్వమనే ఎందుకనాలి ?

ఆధునిక కవిత్వంలో ఎన్నెన్నో ఆలోచనీయంశాలున్నాయి. ఎన్నెన్నో ప్రభావాలున్నాయి!. ఒక కవితనుగానీ, ఒక కావ్యాన్నిగానీ, ఒక వచనకవితా సంపుటినిగానీ పదేపదే చదువుతున్నామంటే, ఏతద్రచనా కాలంలో ఆ కవి పొందిన అనుభూతి అంత గాఢమైనదని నిగూఢార్థం. తేలికైన మాటల పొందికలోనే ఆధునికత లేదు. అసలు, కవిత్వమన్నది మాటల పరదాల వెనుక ఉంది. దాన్నే ఆరుద్ర "ట్రాన్స్‌పరెంట్ పరదా" అన్నాడు గమనించాలి. అలాగే ఎప్పటికైనా మానవపథికుడు చేరుకొనే గొప్ప విశ్రాంతి మందిరం కవిత" అన్నాడుకూడా. అది అనుభూతి విశేషంవల్ల కలిగే ఆనందమందిరం. దాని నీడ ఊరకే ఎవ్వరికీ దొరకదు. దానికి శ్రమించాలి: పరిశ్రమించాలి.

అటువంటి కవితా పరిశ్రామికులు యువకవి శ్రీ శ్రీరంగస్వామి తీవ్రమైనదృష్టి, లోతైన హృదయం ఈ కవికి సహజ సంపదలు.

ఇదివరకు 'మధుర' లో మానవతా మాధుర్యాన్ని ఒలికించి, ఇప్పుడు "శిఖర' దర్శనం చేయిస్తున్నారీ కవి.

ఈ కవిలో లోకావగాహన పుష్కలంగా ఉంది. అలాగే సమాజం లోని అనేకానేక దోషాలమీద ఆగ్రహం, ఆవేదన ఉన్నాయి. రచనలో హాస్యంత వక్రోక్తి, రవ్వంత హేళన ఉన్నాయి.

జీవితంలోని అవస్థల్ని నింగినుండి చూచే నేర్పు ఉంది.

వరంగల్లు పట్టణంలో సాహిత్యాన్ని పండించి, పరిమళింపచేస్తున్న యువకుల్లో శ్రీ శ్రీరంగస్వామిగారికి ప్రత్యేకస్థానం ఉంది. స్వామిగారు పలుకు నేర్పుతో తన ప్రత్యేకతని తాను నిలుపుకోవాలని ఆశిస్తూ—

హైదరాబాదు-500001 —ఆచార్య తిరుమల

---

# కృతజ్ఞతాంజలులు

ఈ కవితా సంపుటిని ప్రచురిస్తున్న "సాహితీ మిత్రులు, మచిలీపట్నం" వారికి, ఇందులోని కవితలు కొన్నింటిని ప్రసారం చేసిన ఆకాశవాణి, హైదరాబాదువారికి, కొన్ని కవితలను ప్రచురించిన పత్రికాధిపతులకూ, నా వ్యాసంగంలో సహకరిస్తున్న మిత్రులందరకూ...

—టి. శ్రీరంగస్వామి

# "అంకితం"

ఈ "శిఖరం" -

" గురుదేవోభ్యన్నమః "

అన్న సూక్తికి నిదర్శనంగా

## నా గురుదేవులకు—

టి. శ్రీరంగస్వామి

# శిఖర సోపానాలు

# హిమజ్వాల

అస్తవ్యస్తంగా ఉన్న రగ్గును
మరింత బిగ్గరగా బిగించుకొని
మత్తులో, సుషుప్తిలో
గాఢంగా నిద్రపోతున్న
ఈ జనాన్ని, జాతిని తిలకిస్తుంటే
నా హృదయంలో ప్రజ్వరిల్లుతున్న
అగ్ని కీలలు
ఈ జడత్వాన్ని కౌగలించుకున్న జనాన్ని
హిమజ్వాలలో కరిగించి
చేతనావస్థలోకి పయనింపచేసి
దేశ కల్యాణార్థం
నా గుండె నిరంతరం
సజీవ చైతన్యానికి
పదం పాడుతూ
పయనిస్తుంది.

# కైమోడ్పు

నా దేశం
సస్యశ్యామలం
నా దేశం రత్నకోశం
నా దేశం పుణ్యనదులు ప్రవహించిన స్వ
నా దేశం పవిత్రం
నా దేశం ఋషులకు, పండితులకు నిలం
నా దేశం వేదాలకు, ఇతిహాసాలకు ప్రసి
నా దేశం ప్రియ జనని
అందుకే జననీ జన్మభూమిశ్చ
స్వర్గాదపీ గరీయసే,
అసతోమా సద్గమయయే కాదు ...
వందే మాతరం, వందే మాతరం.

# మా బడి

జారిన ఇటుకలతో
కూలిన గోడలతో
ఊరి మధ్యలో
తప్పిపోయిన ప్రయాణికుడులా
అంతర్ఘోషతో, జాలిగా చూస్తుంది మాబడి,
సాలార్ జంగ్ మ్యూజియంలోని
శిధిల దృశ్య చిత్రంలా
త్రవ్వకాల్లో బయల్పడ్డగదిలా
హసిస్తూ, అభిశంసన తెలుపుతూ,నిటారుగా...
వందలకు వందలకొద్ది
వర్తమానపు పిల్లల్ని
భావి ప్రపంచంలోకి నిస్వార్థంగా నెట్టి
త్యాగమూర్తిలా ప్రతిబింబిస్తున్నది మాబడి
మా బడిలోనుండి జారిన ప్రతి రేణువూ
జారిన ఇటుకలనూ,
కూలిన గోడలనూ,
విరిగిన బల్లలనూ చూస్తుందేకాని,
మాబడి ఆత్మను పరిశీలిస్తే
అక్షర మంత్రాలను పఠిస్తున్న
అక్షర జ్ఞాన యోగులకు ఆవాస వాటికగా...
ఆశ్రయం కల్పించమని
మౌనంగా, నిశ్చలంగా
స్వాభిమానంగా... అడుగుతున్నట్టు
కనిపిస్తుంది మా బడి.

# మా ర్పు

అంతర్మథనంలో నుండి
ఆలోచనల చివరల్లో నుండి
ఊహాల పల్లకిలో నుండి
చైతన్యపు అరల్లో నుండి
సజీవంగా, నిత్యనూతనంగా,
కాంతి పుంజంగా
సాదృశ్యంగా వెలువడేది
రసఝరిలాంటిది...

# ఇంటర్‌వ్యూ !

యస్, కమిన్... !

మీ పేరు...

... ...

ఏం చదువుకున్నారు

... ...

గుడ్ ! అనుభవం

... ...

ఒకె., మీరు బి. సీ., యస్. సీ...

నేను యస్. సీ...

సారీ! ఈ ఉద్యోగం బీసీకి కేటాయించబడింది

మరి మన రాజ్యాంగం...

కుల మత రహితత్వ రాజ్యాంగం...

డోన్ట్ వేస్ట్ మై టైమ్ ! యు కెన్ గో !

నెక్స్‌ట్ !!!

# ఉత్సవాలు

అంతా కల
అంతా ఊహ
అంతా ఆనవాయితీ, ఆచారం
జయంతులైనా, వర్ధంతులైనా...
ఆనవాయితీగానే జరిపిస్తాం.
గాంధీ అయినా, లాల్ బహదూర్ అయి
ఎవరైనా మాకొకటే...
ఆనవాయితీగా జరిపిస్తాం...
మాకు వారి ఆశయాలు తెలుపుకున్నా
మా ఉనికిని తెలుపుకునేందుకు
ఆ యా ముసుగుల్ని వేసుకుంటాం.
ఎవడో ఒకడు
గొప్పంటే మేమూ గొప్పంటాం...
ఎవడైనా తిడితే
మేమూ చెడ తిట్టేస్తాం
మా బుర్రల్లో
గొర్రెలున్నాయి
జయంతులైనా, వర్ధంతులైనా...
ఆనవాయితిగా, ఆచారంగా...
ఆడంబరంగా... జరిపిస్తాం...
అంతా కల
అంతా ఊహ
అంతా మిధ్య.

# ఆహ్వానం

మళ్ళీ... మళ్ళీ....
ఆహ్వానిస్తున్నాను
స్నేహ, సౌహార్ద్రాలను
మీ అందరికీ అందించాలని
ఆహ్వానిస్తున్నాను
నూతనత్వానికి
శుభోదయం పలుకుతూ
శుభాకాంక్షలు అందిస్తూ
ఆహ్వానిస్తున్నాను.
చైతన్యానికి నాందిని
పలుకుతూ ముందుకు సాగమని
ఆహ్వానిస్తున్నాను
మళ్ళీ .... మళ్ళీ ....
ఈ ఉషస్సాగమనంలో
నవనవోత్సాహంతో
మీ హృదయ కవాటాలను
తెరవండని ఆహ్వానిస్తున్నాను.

# తృణావర్తము

కలకల కలవరంతో
కచిపిచిగా
గజిబిజిగా
పిడికిటిలో ప్రాణాలుగ్గబట్టుకొని
ఒకరి కాళ్ళలో ఒకరి కాళ్ళు
చేతికి అందినంత
చెలిమికి మిగలనంతగా
వస్తున్నాయ్, వస్తున్నాయ్
జలపాతాల.... ఘోషలు
జనపారిజాతాల భాషలు
జన శాతాన్ని తగ్గించేందుకు
వస్తున్నాయ్, వస్తున్నాయ్
ఉరుముల, మెరుపులతో
ఉధృతంగా వస్తున్నాయ్
తస్మాత్ ! జాగ్రత్త !

# తపస్సు - తమస్సు

తపస్సు చేస్తున్నాను
అనవరతం
అష్టావధానాలు చేస్తూ
తపస్సు చేస్తున్నాను
బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల
ప్రత్యక్షం కొరకు
మాత్రంకాదు తపస్సు
ఈ తపస్సు
అర్థానికీ, కీర్తికీ కాదు
నా శ్రమంతా కేవలం
రంభా, ఊర్వశిల కొరకు
అంతేకాదు ... ...
తపః ఫలంగా
మానభంగాలూ
దోపిడీలూ
చేయడానికి
శక్తినివ్వమని కోరడానికి
మాత్రమే ఈ తపస్సు
ఈ తపస్సంతా
ఆ తమస్సును సాధించడానికి మాత్రమే !

# క్రోధన

షష్ఠాదశమున కొొకసారి
ముదిరిన బెండకాయలా
అక్కరకురాని బ్రహ్మచారిలా
వ్యర్థ జీవిని కానని తెలుపుకుంటూ
నవ్య క్రాంతికి
నవనవంగా స్వాగతం పలుకుతూ
మీ ముందుకు వస్తున్నాను.
క్రోధన అనగానే
క్రోధం మీ మనస్సుల్లో...
మా పూర్వీకులను
మాత్రం గుర్తుకు తేనని మాటఇస్తూ....
మీకు మధురిమను పంచాలని
సమ్మదగర్వంగా వస్తున్నాను.

క్రోధన = బెండకాయ

# స్వాతంత్ర్యం

ఓ స్వాతంత్ర్యమా! ఓ స్వాతంత్ర్యమా !!
నీవు ఎక్కడున్నావు,
ఏమూల నున్నావు,
నీ రూపు ఎలాంటిదో
అసలు కనబడతావో, లేదో!
ప్రతి ఒక్కరూ స్వాతంత్ర్యం వచ్చిందంటారు,
వాక్ స్వాతంత్ర్యం
వ్యక్తి స్వాతంత్ర్యం
పత్రికా స్వాతంత్ర్యం....ఇంకా, ఇంకా....
ఏమేమో అంటారు
స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం అంటూ
నీ నామం జపం చేస్తున్నాం
నీ కొరకు
ఎన్నెన్ని ఇబ్బందులో....!
చెఱసాలలు కఠిన శిక్షలు
ఉరి కొయ్యలు
మా పెద్దలు అనుభవించారు.
ఒక వెలుగుకోసం
తమ జీవితాలనే
చీకటిలో ముంచి, పిండుకొని
చరిత్రమీద ఆరవేసుకున్నారు!

నీ పేర
మా తరం వాళ్ళు
ఎవరికిష్టము వచ్చింది వారు చేస్తున్నారు
జన్మహక్కు ....
జన్మహక్కు.... అని ప్రవచిస్తున్నారు
నువ్వూ అలా ఉండు !
ఓ అచేతనవాదుల్లారా
ఇదిగో స్వాతంత్ర్యం
స్వాతంత్ర్యాన్ని
సక్రమంగా వాడుకుందాం రండి....
సోదరులారా రండి !
ఈ స్వాతంత్ర్యం-జాతి
పిత్రార్జితం
స్వార్థం కొరకు ఉపయోగించకండి
సామరస్యం కొరకు
అమరత్వం కొరకు
సహజీవనం కొరకే కాని
పర పీడన కొరకుమాత్రం కాదు....
ఒక శృంఖల త్రెంప
దేశానికి మరో శృంఖల
తగిలించకండి !

# ఆకలనము

అరిగిపోయిన రికార్టులా
ఆవిరి అవుతున్న గొంతుకతో
నవ్య క్రాంతిని వినిపించుదామని
నా కలం, నా గొంతుకతో,
నవ్య రుచుల నందిద్దామని
అతిరథ ప్రయత్నం చేస్తూనే ఉన్నాను.
ప్రగతికి ఎన్నో పథకాలు
ప్రయోజనానికి ఆమడ దూరంలో ....
సగటు మానవుడిలో
మౌలికమైన మార్పుకోసం
మౌనంగా ఎదురు చూస్తోంది....
అంతవరకు
అరిగిపోయిన రికార్డులా
ఆవిరి అవుతున్న గొంతుకతో
అవిశ్రాంతంగా
నా గళం.... !

# అభినవ ఘజనీమహమ్మదులు

వాడు
మహేశ్వరుడు
అపర కాలాంతకుడు
విషాగ్నులను
నొసటి చూపున ధరించినవాడు
అపర మన్మథుడు
సుచరితలకు
కీచకుడు
దుశ్శాసనుడు
మేకవన్నె పులి
నయవంచకుడు
అధైర్యంలో అప్రతిహతుడు,
వెన్నుపోటు పొడవడంలో
ప్రచండ శూరుడు
అందుకే...
అభినవ ఘజనీ, ఘోరి మహమ్మదు
తత్ శరుకు
జయధ్వానాల్...
లేదా...
ఇంతే సంగతులు!

# రిటైర్మెంటు

అర్ధాంతరంగా
ఆదరువు కోల్పోతే
నిరాశా, నిస్పృహలే
తోడు ... నీడ ...

# జీవితం

సీరియల్ కథకు చిత్రించిన బొమ్మలాగ
ఊహల్లో తేలియాడే సుందరిలాగ
మనసున మందారాలు
కెంపులు చేసే మయూరిలాగ—
మనోజ్ఞంగా, మంజులతరంగా—
ఆశల పల్లకిలో
తేలియాడే మధురోహలలాగా
ఉండదు జీవితం.
రెక్కాడితే డొక్కాడని బ్రతుకులు మనవి
దినమంతా శ్రమించినా, శ్రమకుతగ్గ ఫలితం
రాని శ్రమ....
అయినా ....
పాటుపడ్డం తప్పదు
పరిశ్రమించడం తప్పదు
ఎక్కడవేసిన గొంగళి అక్కడే ఉంటోందని
జీవితాన్ని తిట్టుకుంటూ
శ్రమించడం మొదలుపెట్టడం నీకు కొత్తగాదు
ఈ శ్రమ ఇంకొంచెం ....
నీ కొరకు మాత్రమే కాదు
నీలాంటి సోదరులకోసం ....

నిన్ను చూసి
నీ సోదరులు కష్టపడేలా చేయి
వాళ్ళందరూ, నీవు కలిస్తే
అప్పుడు
సీరియల్ కథకు చిత్రించిన బొమ్మలాగా
ఊహల్లో తేలియాడే సుందరిలాగా
ఈ జీవితం ....
మధురంగా, మనోజ్ఞంగా ఉండక తప్పదు.

# అర్థం

మాతృత్వంలోని మధురిమను
ఆస్వాదించినపుడు,
పితృత్వంలోని ఆప్యాయతను
గ్రోలినపుడు,
స్నేహమాధుర్యంలోని ఆత్మీయతను
అందుకున్నపుడు,
ప్రియురాలి కన్నుల కాంతుల్లో
సేదతీరినపుడు,
ఎదుటి హృదయంలో స్వచ్ఛతను
కనుగొన్నపుడు ....
నాకనిపిస్తుంది
జీవితం జీవించడానికని
మనిషిని ప్రేమతో జయించడానికని.

# దర్పం

బుద్బుల
నవ్వుల మధ్యన
వికసించిన
గార్దభం నవ్వులా
నభోంతరాళాలు
ప్రతిధ్వనిస్తుంది
దర్పం.
అది తనకు తనే
కాటందుకునే
సర్పం !

# ప్రకటన

నిన్న మొన్నటి వరకు
ఓట్లకు
నోట్లకు పోట్లాడిన
నవనిర్మాత లేరి ?
వాళ్ళా . . . !
సందుల్లో, గొందుల్లో,
బ్రాందీ షాపుల్లో,
సుఖాల బురదల్లో పొర్లాడుతునా,
సీట్లసర్దుబాట్లల్లో, కుమ్ములాడుకుంటునా
మరి . . .
కనబడుటకు వారికి
తీరికెక్కడిది ?
ప్రకటన చూడటానికి
వీలెక్కడిది .... ?

# కార్మికులు

శ్రామిక రంగంలో
శ్రావణ పూర్ణిమలు మీరు
శ్రమైక జీవనంలో
శ్రమస్వేదనంలో పునీతులు మీరు
దేశ చరిత్రలో
మీరు అజరామరులు:

# బింబం

చిరిగిన బట్టలు
అతుకుల చెప్పులు
జిడ్డోడుతున్న వెంట్రుకలు
చేతిలో కొక్కెం పుల్లలు
నగరం నాగరికతలోని మశి దీపాల
భుజాన పంచ వేసుకొని
ప్రతి చెత్తకుండీ దగ్గరా
పందులతో, కుక్కలతో
సరిసమానంగా చిత్తుతూ
కన్యాకుమారి నుండి
కాశ్మీరం వరకు
ఇనుపముక్కో
గాజువక్కో
కాగితపు తుక్కో
దొరికినపుడు
రవిబింబాలై
నాదేశ చరిత్రకు ప్రతిబింబంగా
ప్రజ్వరిల్లుతున్నారు.

# నూకలు

సమాజంలో పాతుకుపోయిన
రాజకీయ నాయకుల్లా
ఘరానా దొంగల్లా
రౌడీల్లా ....
పెదల నూకల్లో
పెడ్డలు, రాళ్ళు, పురుగులు
పేదల బ్రతుకులు ఎప్పుడూ
క్షేమంలో క్షామంలాంటివే బిడ్డా !

## మంచి కవిత్వం

### కావాలంటే




**చదవండి** **చదివించండి**

ఉన్నత ప్రమాణాలున్న కవితలు, సునిశితమైన విమర్శనా వ్యాసాలు, పిల్లలను ప్రోత్సహించే బాల కవిత, వివాదాస్పదమైన విషయాలున్న చర్చావేదిక, మొగమోటం లేని కవితా సమీక్ష, నవకవి పరిచయాలు....

## అన్నిటికన్నా గొప్ప ఆకర్షణ

అనుబంధంగా అందిస్తున్న

## కవితా సంపుటి

సాలు చందా : 15 రు. జీవిత చందా : 150 రు.

గౌరవ చందా. 500 రు. (పత్రికలో ఫొటో ప్రచురిస్తాం)

శాశ్వత చందా : 1000 రు.

(పై సదుపాయాలతోపాటు మా ప్రచురణలన్నీ పంపిస్తుంటాము)